భగవాన్

# శ్రీ సత్యసాయి శతకము



శతక కర్త

డా॥ మోదేకుర్తి వేంకట సత్యనారాయణ M.A.Ph. D

ప్రకాశకులు

శ్రీ కంచర్ల సుబ్రహ్మణ్య దత్తాత్రేయ (కే. యస్. దత్)

అధ్యక్షులు

భగవాన్ శ్రీ సత్యసాయి సేవాసమితి, విశాఖపట్టణము

భగవాన్

# శ్రీ సత్యసాయి శతకము



శతక కర్త

డా॥ మోదేకుర్తి వేంకట సత్యనారాయణ M.A.Ph. D

ప్రకాశకులు

శ్రీ కంచర్ల సుబ్రహ్మణ్య దత్తాత్రేయ (కే. యస్. దత్)

అధ్యక్షులు

భగవాన్ శ్రీ సత్యసాయి సేవాసమితి, విశాఖపట్టణము

ప్రథమ ముద్రణము 1973

ప్రతులు 1000

అమూల్యం



ప్రేమా ప్రింటింగ్ వర్క్సు,
విశాఖపట్టణం-4

# ప్రస్తావన

విశాఖపట్టణము-3
29-12-1973

మహారాజశ్రీ కంచర్ల సుబ్రహ్మణ్యందత్తు గారికి సనాతన ధర్మాచరణము కవి పండితాదరణము సాహిత్య పోషణము దాన ధర్మాదికార్యాచరణము దైవ కార్యములకు ప్రోత్సహించుట పుణ్య దంపతులగు వారి జననీ జనకులు కీ॥ శే॥ నాగరత్నమ్మ రామబ్రహ్మంగార్ల వలన సంక్రమించినది. శ్రీ దత్తుగారికి భారతీయ మతపురాణ వేదాంతాదు లందు విశేష గౌరవము ప్రవేశము కలదు.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి భక్తులయిన శ్రీదత్తు గారు వారి గృహమందు ప్రతి మంగళవారము సాయంకాలమున భజన; ప్రతిగురువారము ప్రాతఃకాలమున నగరసంకీర్తనము; సాయంకాలము భగవద్గీతాద్యుపన్యాసములు: పర్వదినములందు దైవిక సాంస్కృతిక కార్యక్రమములు; బీదలకు అన్నదానము జరిపించుచున్నారు.

శ్రీ దత్తుగారు భగవాన్ శ్రీ సత్యసాయి సేవా సమితి (విశాఖపట్టణము) కి అధ్యక్షులుగా ఎన్నుకొనఁబడి సుమారు పది భజన మండలులలో ఆ సమితి నిబంధనల ప్రకారము, ఆధ్యాత్మిక సాంస్కృతిక కార్యక్రమములు, బీదలకు అన్నదానము, సంఘసేవ మున్నగు కార్యక్రమములు, అతిసామర్థ్యముతోడను భక్తిప్రపత్తుల తోడను జరిపించుచు స్త్రీపురుషులకు బాలబాలికలకు దైవభక్తిని పెంపొందించుటకు వారి శక్త్యనుసారము సర్వదాకృషి చేయుచున్నారు.

శ్రీ దత్తుగారికి దైవభక్తితోపాటు దేశభక్తి కూడ ఉండుట విశేషము. వారనేక పారిశ్రామిక సాంకేతిక సంస్థలకు ఆధ్యాత్మిక

ధర్మసంస్థలకు సాంస్కృతిక సంస్థలకు అధ్యక్షులుగాను డైరక్టరుగాను సభ్యులుగా నుండి వారి దేశభక్తిని సర్వతోముఖ ప్రజ్ఞను చూపించి విశేషఖ్యాతిని ఆర్జించిరి. వారలంకరించిన పదవులలో కొన్ని మాత్రమే యిచ్చట పేర్కొనఁబడుచున్నవి. శ్రీ దత్తుగారు ఆంధ్రాబేంకుకు అధ్యక్షులుగా నుండి ఆ సంస్థను శాఖోపశాఖలుగ వృద్ధి చేసిరి. మఱియు రోటరీ అంతర్జాతీయ సంస్థకు గవర్నరుగా రెండు పర్యాయములు ఎన్నికై అపార సేవచేసి ఆ సభ్యుల మన్ననలకు పాత్రులయిరి. విశాఖపట్టణములోనున్న ప్రేమ సమాజమునకు గత 25 సంవత్సరములుగా అధ్యక్షులుగా నుండి ఆ సంస్థయొక్క అభివృద్ధికి సర్వవిధముల తోడ్పడుచున్నారు. కె. ఆర్. అండ్ సన్స్ అను సంస్థకు అధ్యక్షులుగాను, హిందూస్థాన్ షిప్‌యార్డు (విశాఖపట్టణము) కు డైరక్టరుగాను, విశాఖ పోర్టుట్రస్టు, విశాఖడాక్ లేబర్ బోర్డు సంస్థలకు ట్రస్టీగా నుండి శ్రీ దత్తుగారు ఆ సంస్థలకు చిరస్మరణీయమగు సేవచేయు చున్నారు.

అట్టి శ్రీమంతులు సదాచారసంపన్నులు వదాన్యులు దైవభక్తిపరాయణులు మానవసేవారతులు సాహిత్య ప్రియులు నగు శ్రీదత్తుగారు భగవాన్ శ్రీసత్యసాయి బాబా వారిచే ప్రేరితుఁడనై నేను రచించిన యీ శతకమును ముద్రింపించి భక్తులకు ఉచితముగా అందఁజేయు నౌదార్యమును వహించి యున్నారు. ఈసందర్భములో శ్రీ బాబావారు శ్రీదత్తుగారికి వారి కుటుంబమునకు ఆయురారోగ్యైశ్వర్యములను ఐహికాముష్మిక సుఖశాంత్యానందములను ప్రసాదింపవలెనని భగవానుని ప్రార్థించుచున్నాను.

స్వల్ప వ్యవధిలో ప్రత్యేక మయిన శ్రద్ధతో ఈ శతకమును ముద్రించిన ప్రేమ సమాజము (విశాఖపట్టణము) ముద్రణ కార్య నిర్వాహకులకు భగవంతుఁడు సర్వశ్రేయముల నొసంగుగాక.

మోదేకుర్తి వేంకట సత్యనారాయణ

తెలుగు డిపార్టుమెంటు
ఆంధ్రాయూనివర్సిటి
వాల్తేరు

# ఉపోద్ఘాతము

ప్రశాంతినిలయము
పుట్టపర్తి
29-11-1973

భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారు ఆంధ్రప్రదేశము నందలి అనంతపురము జిల్లాలోగల పుట్టపర్తి గ్రామమున సనాతన భారతీయ ధర్మోద్ధరణమునకై అవతరించిరి. సర్వజ్ఞుఁడు సర్వశక్తి సంపన్నుఁడు అగు ఆభగవానుని మహిమలు లీలలు ఐహికబాధా నివారకములు శారీరక మానసిక వ్యాధిహరములు అనంతములు యోగశాస్త్ర సమ్మతములు అనుభవైక వేద్యములు ఆశ్చర్యానంద కరములు మానవ శక్త్యతీతములు ఆస్తిక్య భావ జనకములు సనాతన ధర్మాచరణ బోధకములు విశ్వమానవ కల్యాణ కరములు నానాజాతి కులమతాతీత ప్రేమ తత్త్వ ప్రచారకములు. ఆధ్యాత్మిక విద్యాప్రబోధకములు సచ్చిదానందదాయకములు విశ్వశాంతి స్థాపనా దక్షములు ఆధునిక భౌతిక శాస్త్ర పరిజ్ఞానమునకు పరిశోధనలకు పరికరములకు ఆయా శాస్త్రవేత్తలబుద్ధి విజ్ఞానములకు అగమ్యములు అగోచరములు ఊహాతీతములు.

శ్రీ బాబా వారి మహిమలు లీలలు చూచినవారు తత్ఫలితములను స్వయముగా అనుభవించి ఆనందించిన వారు ఈ భారత దేశము నందేగాక విదేశములందును గలరు.

ప్రాచీనాధునాతనములు లౌకికాలౌకికములునగు శాస్త్రములందు నిష్ణాతులైన మహామేధావులు పరిశోధకులు పండితులు ప్రాచ్యపాశ్చాత్య వైద్యశాస్త్ర విశారదులు, శ్రీమంతులు కూడ ప్రత్యక్షముగాను పరోక్షముగాను స్వానుభవ పూర్వకముగాను వివిధ బాధానివారకములగు శ్రీ సత్య సాయిబాబా వారి మహిమల వలన, లీలల వలన ఆకర్షింపఁబడిన వారై శ్రీ బాబా వారిని భగవాన్ అనిపిలుచుచు వారి పవిత్ర సాయి నామమును జపించుచు వారిని దర్శించుచు, వారిని భజించుచు వారిసూక్తులను పాటించుచు వివిధభాషలలో రచింపఁబడిన వారి జీవిత చరిత్ర, లీలలు,

మహిమలు ఉపన్యాసములు గల గ్రంథములు చదువుచు వారి కృపకు పాత్రులగుచున్నారు.

దయామయులగు శ్రీ సత్యసాయి బాబా వారి మహిమవలననే నేను విశాఖపట్టణము నుండి పుట్టపర్తికి వచ్చి ఈ ప్రశాంతి నిలయములో ఆరోగ్య సుఖ శాంత్యానందములతో సుమారు నలుబది దినములు శ్రీ బాబావారి దర్శన స్పర్శన సంభాషణాది భాగ్యములను పొందగల్గితిని, భగవాన్ ప్రేరణము వలన Sri K. P. Viswanatha setty (Harinivas, Mangalore-3) నన్నిచ్చట సోదర ప్రేమతో చూచి నందులకు వారికి కృతజ్ఞుడను.

భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారి దర్శన భాగ్యము నాకు లభింపక పూర్వమే రెండు సంవత్సరములకు ముందు వారి ప్రేరణము వలననే ఈ భగవాన్ శ్రీ సత్యసాయి శతకము, శ్రీరామ శ్రీకృష్ణ శ్రీపాండురంగ శతకములు, శ్రీ వేంకటాచల మాహాత్మ్యము (ఆంధ్ర వచనానువాదము) రచించితిని.

ఈ ప్రశాంతి నిలయములో భగవాన్ దర్శన స్పర్శన సంభాషణముల ప్రభావము వలననే భగవాన్ బాబా వారి మహిమలు లీలలు జీవిత విశేషములు 550 సంస్కృత శ్లోకములలో వ్రాసితిని. అట్టి మహా గ్రంథమును విశాఖపట్టణములో పూర్తి చేయుటకును ఈ శతకమును అచ్చువేయుటకును నాకు అనుమతినిచ్చి నాయెడల ఇట్టి అవ్యాజ ప్రేమ చూపించి నాసారస్వతాధ్యాత్మిక లౌకిక ప్రగతికి నన్ను ప్రోత్సహించుచు తోడ్పడుచున్న భగవాన్ శ్రీసత్య సాయిబాబా వారికి సర్వదా విధేయుడనై సాష్టాంగవందనము లర్పించుచున్నాను.

నే రచించిన యీశతకమును గూర్చి కవి పండిత విమర్శకాగ్రేసరులు తమ యభిప్రాయములు వ్రాసి నన్ను ప్రోత్సహించినందులకు వారికి నా హృదయ పూర్వకనమోవాకములు.

భగవాన్ బాబా వారి భక్తుడు
మోదేకుర్తి వేంకట సత్యనారాయణ

# పండితాభిప్రాయములు

Prof. K. V. R. Narasimham M. A. Ph. D
Head of tha Dept. of Telugu
Andhra University, Waltair

శ్రీ మోదేకుర్తి వేంకట సత్యనారాయణ గారు " సత్యస్వరూప ! సత్యసాయి బాబ ! " అను మకుటముతో భగవానుఁడగు శ్రీ సత్యసాయి బాబాను గూర్చి వ్రాసిన శతకమును వారే చదువగా విని ఆనందించితిని. ఇందు సాయి భగవానుని జనన మహిమాద్యనేక విషయములు వీనుల విందగు సులభశైలిలో అభివర్ణింపఁబడినవి. ఇది భక్తులందఱును చదివి ఆనందింపఁదగిన గ్రంథము. భక్తజన వరదుఁడగు సాయి భగవానుఁడు ఈ గ్రంథ కర్తకు ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించుగాక.

విశాఖపట్టణము-3 — కాకర్ల వెంకట రామనరసింహం
2-6-1971

## ఉభయ భాషాప్రవీణ

కొమ్మనమంచి జోగయ్యశర్మ M. A. D. L. Sc.,
Assistant Librarian — Andhra University, Waltair

హైందవ ధర్మమును పరిరక్షించుటకై అవతరించిన అవతార మూర్తులలో పుట్టపర్తి యందు నెలకొన్న శ్రీ సత్యసాయి బాబా యొకరు. ఆమహనీయుఁడు సిరిడి సాయి బాబా యొక్క అపరావతారమనియు భక్తులభావన. అట్టి భక్తులలో శ్రీయుత మోదేకుర్తి వేంకట సత్యనారాయణ యొకఁడు. ఈయన అహరహము తన్మయుఁడై సాయి భజనారాధనలు సేయుచు తన భక్తిభావమును ఈ శతక రూపమున ఆవిష్కరించినాడు.

ఈ రచన శతకవాఙ్మయములో ఉత్తమ శ్రేణికి చెందినదనుట రసికజన హృదయములే గ్రహింపఁగలవు. అందమైన ఆటవెలఁదులతో తేటతెల్లమగు తెనుఁగు నుడికారముతో అప్రయత్న ప్రసన్నమైన సుకుమారమగు శైలితో నడచిన యీతని రచనము చదివినచో వేమన పోకడలు గురుతునకు వచ్చును.

ఇందు సాయి జననము, అవతారము, తత్త్వము, అర్చనము, మహిమలు, భక్తుల శీలము, ప్రశాంతి, నిజభక్తి, నిజభక్తుడు, భక్తరక్షణము, దాతృత్వము వేషభాషలు, దేవళములు, దేశభక్తి, వేదవిద్య, ఆత్మవిద్య మున్నగు విషయములను గూర్చినిరూపింపఁబడినది. మొత్తముపై ఈ రచనయందు శ్రీ సత్య సాయిబాబా యొక్క స్వరూప స్వభావములు క్లుప్తముగా వివరింపఁబడినవి.

ఇట్టి సర్వోత్తమమగు వస్తువును స్వీకరించి సులభమగు శైలిలో సర్వజన పఠన యోగ్యమగు శతక రూపమున సంతరించిన యీతని యుద్యమము సాయి భక్తులకే గాక ఆంధ్రులకెల్లరకు ఆదరణీయమగుననుటలో సందియము లేదు.

శ్రీయుత సత్యనారాయణ ఇంకను ఇట్టివే రసవత్తర భక్తిపూరిత రచనలొనర్చి తాను తరించి భక్తులను తరింపఁజేయుగాక.

కొమ్మనమంచి జోగయ్యశర్మ

రామనగరం

విశాఖపట్టణం-3

30-5-1971

**Dr. E. Krishnamacharya M. A. Ph. D**

**Lecturer in Telugu Dept.** **Andhra University, Waltair**

అప్రయత్నముగా భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారు ఈ శతకమును డాక్టరు. ఎం, వి, సత్యనారాయణ గారిచే రచింపజేసినారు, భగవదవతార లీలలనంతములు. అందిది యొకటి.

దీని కర్తయగు డాక్టరు సత్యనారాయణగారి హృదయమున నిలిచిన శ్రీ బాబావారు కారయితగా నిట్టి కృతివలన సహృదయాస్తిక్యము కృతకృత్యమగును.

ఈ మార్గమునారంభించిన శ్రీబాబా వారి సంకల్పభాస్కరకిరణము ఈ కవి హృదయ పద్మము నుండి భక్తిసౌరభ గుణసనాథమగు కావ్య రజస్సహస్రము రచింపఁజేయుగాక. దానికి తగిన ఆయురారోగ్యైశ్వర్యములను వీరికి కలుఁగఁజేయుగాక.

విశాఖపట్టణము-3

ఎక్కిరాల కృష్ణమాచార్య

31-5-1971

## శ్రీ సత్యసాయీశ్వరీస్తుతిః

శ్లో. సత్యసాయీశ్వరీం వన్దే సర్వలోకనివాసినీమ్
భక్తాభీష్టప్రదాత్రీం త్వాం భవరోగవినాశినీమ్ 1

అజ్ఞాన నాశినీం దేవీం సుజ్ఞానామృతదాయినీమ్
శుద్ధమోక్షప్రదాత్రీంచ భజామి మనసా సదా 2

పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే
త్వద్దర్శన స్పర్శ నాభ్యాం సర్వబాధా నివార్యతే 3

పూర్వజన్మ కృతాత్పుణ్యాత్ దర్శనం మమయచ్ఛసి
సాష్టాఙ్గ వన్దనం కర్తుం దయాంకురు మయీశ్వరి ! 4

షట్చక్రచారిణీ దివ్యా కుండలిన్యాఖ్యయా మమ
సుషుమ్నామార్గసంచారిణ్యంబా సాయీతి మేమతిః 5

శ్రీ షోడశాక్షరీ విద్యారూపిణీం త్వాముపాస్మహే
బ్రహ్మజ్ఞానం సదాదేహి భవరోగవినాశిని ! 6

లౌకికా లౌకిక జ్ఞానం లౌకికా లౌకికం సుఖమ్
కుటుంబ క్షేమ సౌఖ్యేచ మమదేహి దయామయి ! 7

మత్సాధన సుసంతుష్టా సహస్రారామ్బుజస్థితా
శివేనసహ మోదస్వ ఆనన్దం దేహిమే సదా 8

మోడేకుర్తి
వేంకట సత్యనారాయణః

ప్రశాన్తి నిలయః
27-10-1973

భగవాన్

# శ్రీ సత్యసాయి శతకము

ఆ. వె. సత్య సాయి! నీకు సాష్టాంగనతిఁ జేసి
సన్నుతింతు నిన్ను శక్తికొలఁది
సర్వజనులఁ బ్రోవ సాక్షాత్కరించిన
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 1

ఈశ్వరాంబ తనయ ! ఈశ్వర ! భవహర !
ఎట్టి పుణ్యవతియొ యీశ్వరమ్మ
భవ్యమూర్తి వయిన బాబ! నిన్గనిపెంచె
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 2

బాల్యమందు నీవు బహు భాష తెలుఁగవు
శాస్త్ర లేశమైనఁ జదువ వైతి
గురువులపుడు నీదు గుట్టెఱుంగరు కదా !
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 3

నేఁడు చూడ నీవు నిఖిల భాషావేత్త
వఖిల శాస్త్ర నిచయ మందుఁ గూడ
కోవిదుండ వగుచు గోచరింతువు మాకు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 4

వేదు కోలు సల్పఁ బెక్కు దేవత లేల ?
కనుల యెదుట దివ్యకాంతి చిమ్మ
పరమ శాంతి వఱలు భవ్యుఁడ వీవుండ
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 5

ఱాతి కట్టడమున ఱాతి విగ్రహ మయ్యేగా
దేవుఁడుండ, నీవు దివ్య తనువుఁ
దాల్చి మమ్ముఁగావ ధరఁ బుట్టితివి దేవ !
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 6

ఆత్మలింగ మనయ మాత్మలోన వహించి
ఆప్త భక్త వరుల యార్తిఁ బాప
నాత్మలింగ మిచ్చి యాదరింపవె స్వామి !
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 7

దశవిధాల దేవ దర్శనమును జేయఁ
గలము నీదు దివ్య కాయమందు ;
అరయ రామ కృష్ణ లనఁగ నీవే సుమీ
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 8

తొల్లి షిర్డియందుఁ దోఁచితి సాయిగా ;
నేఁడు పుట్టపర్తి నీదు నెలవు
గాఁగ, సత్యసాయిగా నీవు వెలయవే
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 9



కంటి కింపు గూర్చు కాషాయ వస్త్రముల్
నీదు మేన మెఱయ నీవు తరుణ
భాస్కరుఁడు గఁగాంతి ప్రసరింపఁ జేసెదు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 10

పుట్టపర్తియిలను బుణ్య స్థలంబుగా
నిను భజించు భక్త జనులు తెలిసి
"తండ తండము" లుగ తరలి వత్తురు ప్రీతి
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 11

నన్నుఁ గూర్చి చెప్ప నాకు శక్యము 'గాదు ;
నీదు మహిమఁ గూర్చి నేను నుడువఁ
గలనె? యల్ప బుద్ధిగల మానవుండను ;
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 12

కలియుగాన మాయ కలఁత పెట్టుచు నుండఁ
గల్ల బొల్లి మాటలెల్ల వినెడు
మనుజ తతికి నీదు మహిత మార్గముఁజూపు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 13

దేవళముల కరిగి దేవతార్చన సల్పి
దేవుఁ జూడనట్టి జీవులకిల
సాయిదేవ! నీవు సాక్షాత్కరించెదు ;
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 14

జగతిలోన నీవు సద్వృత్తు లొనరించు
సర్వ కర్మలకును సాక్షివగుదు
శాంతి నొసఁగి నీవు సద్గతిఁ జూపుదు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 15

భవభయాపహర! సాయి! భక్తముక్తి ప్రద!
భక్తకోటిఁ గాచు భారమూని
భక్తిని నెలకొల్ప భవము నొందితి వీవు ;
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 16

భక్తవరులు నిన్ను భగవానుఁ డంచును
భజనచేసి మేలు పడయుచుండ్రి
భుక్తి ముక్తు లిచ్చు పురుషోత్తముఁడవీవె
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 17

సర్వ భూతములను సాయి! వ్యాపింపవే ?
సర్వమందు నీవె సంచరింతు
సాయి! నిన్నుఁ జూడ సర్వంబుఁ జూచుటే
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 18

సాయి! చూపఁగలవు సర్వంబు నీలోన ;
హితుఁడ వీవు భక్త వితతికెల్ల ;
సతతము నినుఁ గొల్వ శాంతి లభించెదు ;
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 19



భక్తి లేక నిన్నుఁ బరికించు జనులకు
తెలియనగునె నీదు దివ్యమహిమ ?
జన్మ శతములైనఁ జాలునా విన్నన ?
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 20

భక్తులందు నీవు పరఁగఁ,దద్భక్తులున్
పరఁగు చుండ్రి నీదు ప్రకృతియందు ;
సాయిఁ గొల్చి జనులు సాయుజ్యమందరే ?
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 21

ఈశ్వరుండ వగుట నిత్తు వైశ్వర్యంబు
భక్తజనుల కెపుడు భవ్యసాయి !
భజనచేయువారి భారంబు వహియింతు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 22

నిన్నుఁ జూడ మఱియు నీలీల లరయంగ
చిన్ని కృష్ణువివలెఁ జెలఁగె దీవు
నటనయందు మిన్న నటరాజశేఖర !
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 23

ఆర్ష తత్త్వ విదుఁడ ! యజ్ఞముల్చేయించి
ఆర్ష సంస్కృతినిల నాదుకొందు ;
ధర్మ దీక్షవూని ధర్మంబు నిల్పుదు ;
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 24

ఎవరి యిష్టదైవ మెవరో నీవూహించి,
అట్టి దైవలీల లపుడె చూపి
భక్త వరులఁగాచు భగవానుఁడవు స్వామి !
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 25

నిర్గుణుండవైన నీవు పూరుషరూప
మంది, యాత్మనుండి యాత్మలింగ
మవలఁదీసి, దానికభిషేకమును సల్పు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 26

నీవు కోరకున్న నిన్ను భజింతురు
నీదు భక్తకోటి నీ కృపామృ
తము నిరంతరమ్ము తనివి తీరఁగఁ గ్రోలి ;
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 27

కౌశికుండు నాఁడు కావించెనో లేదొ
సృష్టికెనసెడు ప్రతిసృష్టి యొకటి ?
చూడఁగలముదేవ ! నేఁడు నీ సృష్టిని ;
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 28

శివుఁడె కేశవుండు శివకేశవుల కెప్డు
భేదమొదవదంచు నీదు భక్త
జనులకు సతతంబు చాటుచుందువు స్వామి !
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 29



మనసునందు నిన్ను స్మరియించినంజాలు
మమత లెల్ల మదిని మాయమగును
తెలియ వశమెనీదు దివ్య మహత్త్వమ్ము
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 30

యోగసిద్ధులు గల యోగీశుఁడవు నీవు ;
నిన్నుఁగాన లేక నీదుయోగ
గరిమ నెఱుఁగఁగలరె నరులీధరాస్థలి ?
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 31

భజనలందుఁ బ్రీతి భక్తవరద ! నీకు
పూజలందుఁ బ్రీతి ముక్తిదాత !
దివ్యశక్తులున్న దేవుండవీవయా
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 32

పాపికూడ నీదు పదములు ముట్టినఁ
బాసి పోవు వాని పాపచయము ;
భక్తి కలుగఁ జేయు భగవానుఁడవు దేవ !
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 33

జారచోరులయిన, సాధువంచకులైన
హంతలైన నిన్ను నాత్మలందుఁ
దలఁచు నెడల మారి ధన్యులౌదురు కదా !
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 34

నీదు జుట్టులోనె నీ గుట్టుకలదంచు
నీదు చోటుచేరి నీచబుద్ధి
నెఱపినట్టివారు నిజముగా పశువులే
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 35

నమ్మినట్టి జనులు నమ్మని వారలు
నిన్నుఁ జూచినంత నీ ప్రశాంత
నేత్రయుగళి వారి విశ్వేష్టలంజేయు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 36

మాయ యందు నీదు మహిమలన్నియుఁ జూచు
మలిన చిత్తులకట ! తెలియలేక ;
దానవారి లీల దైత్యు లెఱింగిరా ?
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 37

పరమతస్థులొగిని పరమార్థ మర్థించి
నిన్ను శరణుఁ జొచ్చి నీవుచూపు
సర్వమత విశాల సమదృష్టి నేర్తురు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 38

పుణ్య నరుల కీవు పురుషోత్తముఁడవయ్య ;
భద్రమూర్తి వీవు భక్తతతికి ;
పండి తోత్తములకు బ్రహ్మతేజుండవు ;
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 39



కాలు చేయిరాక కలఁగెడు జనులకు
కాలు చేతులొసఁగి కాచువాఁడ !
కర్మ బంధములను గడముట్టఁ జేయుదు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 40

వైద్యమునకు సాధ్యపడని రోగుల దీర్ఘ
రోగ బాధలెల్ల రూపుమాపు
దివ్యవైద్య మెఱిఁగి తేజరిల్లెదవీవు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 41

పుట్టుగ్రుడ్డి నీకుఁ బొడ గట్టఁగా వాని
కన్నుఁగవకు దృష్టి కలుగఁజేయు
మహిమనీకుఁగాక మఱియేరికుండును ?
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 42

పంచభూతములను బంధింపఁజాలెడు
శక్తికలదు నీకు సాయిబాబ !
పరమశాంతమూర్తి ! భగవంతుఁడవుస్వామి !
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 43

అమృతకరుని దర్శనమున సరస్సులోఁ
గలువపూలు విచ్చుకరణి నిన్నుఁ
గనినయంత భక్తజనముల్ల సిల్లదే ?
సత్స్వరూప ! సత్యసాయి బాబ! • 44

* నీదు నాజ్ఞఁజదల నీలమేఘమ్ములు
క్రమ్ముకొనెడు ; మఱియు క్షణములోనె
మాయమౌను నీదుమహిమచే నవియెల్ల
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 45

ఎటనొ తప్పుచేసి యేఁగుదెంచినవాని
యెగ్గునీదు దివ్యదృష్టినెఱుఁగఁ
గలవు ; నీదుకన్నుఁగప్పఁగా శక్యమే !
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 46

శీలరహితులైన స్త్రీపూరుషులు నిన్నుఁ
జేరికొలువ భక్తిశీలమబ్బు ;
సిరియు శీలమిచ్చు శ్రీశ ! యీశ ! విధాత !
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 47

భక్తిలేనిపూజ భవనమ్ములోఁ జేయు
గొప్పవాని కన్న గుడిసెలోన
భజన చేయుపేద భక్తుఁడే నీఁవాడు
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 48

గంపెడేసిపూలు గంధమ్ము విరఁజిమ్మ
సరములల్లి పూజసలుపనేల ?
హృదయకుసుమగంధ మీవు మెత్తువుగాదె ?
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 49



భక్తిలేనివాఁడు బానతోఁబెట్టిన
పాలుముట్టఁబోవు భవ్యసాయి !
భక్తియొకటెచాలు ; పరమాన్నమదినీకు ;
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 50

భక్తిలేక వట్టిరక్తితోఁబాడిన
భుక్తినిత్తువేమొ ముక్తినెంత
మాత్రమీవు ; వాని మనసు నీవెఱుఁగవా ?
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 51

నీకు భక్తినిడిన నిత్యనివేదనల్
పరఁగుమాకు మధురభక్ష్యములుగ ;
నీవు ముట్టకున్న నిస్సారమగునవి ;
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 52

మనుజ జన్మమెత్తి మాయలోఁబడి పోయి
చేయరాని పనులఁజేసిచేసి
పుట్టపర్తి కేఁగఁబుట్టు సుజ్ఞానంబు ;
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 53

భవమునెత్తి దైవభక్తిభావంబులు
మృగ్యమైన నరుఁడు మృగమువంటి
వాఁడు ; నీవుకరుణఁజూడ మేలొందఁడే
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 54

ఎన్నిజన్మలెత్తి యెన్నాళ్లు బ్రతికిన
సాయినామజపమె చాలునాకు ;
మధుర మధురమైన సుధయౌను నాకది;
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 55

భజనమన్న నీదు భజనమే హృత్యంబు
పూజయన్న నీదు పూజమేలు
జపమెయన్న నీదు జపము శుభంబిడు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 56

సాయి ! తండ్రివీవె చల్లని తల్లివి
సాయి ! నీవె నాకుహాయిగూర్తు
సాయి ! నీవె మిన్న సర్వంబు కన్నను
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 57

నీదు జపముచేసి నిన్నుఁజూచెద సాయి !
నిన్నుఁ బూజచేయ నన్నుఁజూతు
సాయి ! నీవె నాకు జగతిలో హితుఁడవు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 58

అన్నియాత్మలందు నధివసించిన స్వామి !
నాదు మదినిఁజూతునీదు రూపు ;
నిన్నుఁ జూచినపుడు నన్ను నేనెఱుఁగుదు ;
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 59



కన్ను మూయనీవె కన్నువిప్పఁగనీవె
కానుపింతు వెడఁదఁగలుగు శాంతి ;
నీదు రూపులోనె నిర్గుణత్వ మెసంగు ;
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 60

చేరి యడుగనేల ? కోరి నీవొసఁగవా ?
యీయఁదగిన వీవె యిచ్చుచుందు
భక్తకోటి కాప్తబంధుఁడ వీవెగా
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 61

లోభివాని ధనము లోకులు హరియింతురు ;
ధనికుఁడైనవాఁడు దాతయైన
అతని విత్తమునకు హాని వాటిల్లదు ;
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 62

ధనము నరులకిత్తు ధనదుఁడ ! ధనమును
దాన ధర్మములకుఁ తగినరీతి
వాడు నట్టి నరుఁడు బాబ ! నీ శిష్యుండు
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 63

ధనికులైన శాంతిఁగనక నీపదముల
వ్రాలుచుందురు ; నీవు వారి వెతలఁ
దీర్చి పరమశాంతిఁగూర్చు చుందువు స్వామి
సత్స్వరూప ! సత్యసాయి బాబ !. 64

కలుషమతులుగాని కఠినాత్ములను గాని
వినయ మొప్ప నిన్ను వేడినపుడె
వారిఁజేరఁదీసి వరములిత్తువుగాక !
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 65

ఆత్మశుద్ధిలేని యాడంబరమునకు
వశముకావునీవు ; ప్రవిమలాంత
రంగశౌచమె నినురంజింపఁజేయును
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 66

దేశమందు నేఁడు దేవళంబులఁగూలఁ
దీయఁబూనినారు మాయనరులు
కొంద, అకట ! వారి మందలింపుము దేవ !
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 67

జాతియొక్క పూర్వసంస్కృతిఁదెలిపెడు
క్షేత్రఖండములుగ క్షితిని వెలయు
దేవళములఁగావ దివ్యశక్తి నిఁజూపు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 68

కలియుగమ్మునందుఁ గల్పకద్రుమముగా
వెలసితీవు భక్తనిలయమైన
భరతభూమియందు భక్తులకొల్వఁగా ;
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 69



భరతభూమినుండి పరపాలనము పోయె
స్వీయపాలనంబుచేకుఱినది ;
స్వీయనాయకులకు శీలసంపదలిమ్ము ;
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 70

మునుల ఋషులఁగన్న పుణ్యదేశమ్ముగ
భరతభూమి పేరువడసె ; నట్టి
యవని నేఁడు నెగడు నజ్ఞుల మార్చెడి
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 71

దేశసేవ మఱచి దేశనాయకులిల
స్వార్థపరులుగ నెసంగనేల ?
దేశనాయకులకు ధీశక్తినీయవా ?
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 72

దేవభక్తిఁగలిగి దేశసేవను జేయ
దేశమునకు కల్గు దివ్యరక్ష
దేవభక్తియున్న దేశసేవయె మిన్న
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 73

దుష్టహృదయులకు విశిష్టబుద్ధినొసంగు
శీలపాలకుఁడవు శిష్టసాయి !
సత్త్వ గుణరతుండ ! పర్వేశ్వరా ! స్వామి
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 74

సంఘసేవచేయు సజ్జనుల్ నీవారు
సంఘరక్షకుఁడవు సత్యసాయి
శాంతి ధర్మనిరత సత్యరూపుఁడవీవు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 75

అద్వితీయమైన యణుశక్తికన్ననీ
యాత్మశక్తి మిన్న, యర్కతీక్ష్ణ
కిరణబంధురాస్య ! పరమతేజోమయా !
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 76

విశ్వశాంతినేర్పు విద్యయే నీ విద్య
విశ్వశాంతిఁగూర్పు విజ్ఞుఁడవయి
వివిధమతములీవె విశదీకరింతువు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 77

మతముపేరుచెప్పి మతబోధకులుచేయు
మాయలెన్నియేని మహినిగలవు ;
మాయలేని విశ్వమతబోధ నీబోధ
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 78

నీదు సత్యమతము నేర్పిన మానవ
జాతులందు భీతిసమసిపోవు ;
మారణాస్త్రములను మట్టిలోఁగలియవా ?
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 79



మనుజ జన్మమన్న మహినుత్తమంబగు ;
మనుజుఁడజ్ఞుఁడగును దనకుఁదానె ;
జ్ఞానమొసఁగి మనుజ సంతతిఁగావుమా
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 80

దేహమరయ దివ్యదేవాలయం బండ్రు ;
జీవుఁడందువెల్గు దేవుఁడండ్రు ;
అట్టిమెఱుక నిశ్చయమ్ముగ నాకిమ్ము
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 81

విద్యయన్న వేదవిద్యయే జగతిలో ;
నీదునుడులఁగలదు వేదవిద్య ;
నిగమసారమెల్ల నీ వాక్యములఁదోఁచు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 82

వేదములను నిమిడె విశ్వరహస్యమ్ము ;
విశ్వమర్మమెఱిఁగి వెలుఁగునీవు
వేదమూర్తివగుదు ; వేద మతోద్ధార !
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 83

శ్రుతులు గఱచినట్టి శ్రోత్రియ వర్గమున్
దూషణమ్ముసేయు దోసకాండ్రు
బుద్ధిబాగు పడఁగ బోధింపుమోదేవ !
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 84

శ్రుతులు చదువుచుండ్రి శుద్ధమోక్షముఁగోరి ,
శ్రుతులఁజదువనేల ? శుద్ధమోక్ష
సిద్ధికరుణనీవు చేకూర్పఁగా స్వామి
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 85

ఆత్మఁగూర్చి తెలియ నాశ్రయించినవాని
నహముపీడుమంచు నానతిత్తు
వయ్య యదియె యతిరహస్యమౌ సత్యంబు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 86

మమత మానవునకుఁగమల పత్త్రమునందు
నిలిచియుంటనట్టి నీటికణము
వోలె నుండునేని పొసఁగును సౌఖ్యంబు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 87

మూఢమతిని నేను : మూఢత్వముంబాపి
మోక్షవిద్యఁదెల్పి ముక్తి నిమ్ము
నీవునేర్పఁగలవు నిఖిలరహస్యముల్
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 88

గురువులిలను గలరు కోట్లకొలంది ; త
ద్గురుల నిన్నుఁబోలుగురుఁడు కలఁడె ?
బుద్ధినుద్ధరించి మోక్షంబునీయవే
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 89



ఉపనిషత్తులిచ్చు నుత్తమజ్ఞానంబు ;
నుపనిషద్వికాస మొందనీవె
యిత్తు మాకు నుత్తమోత్తమజ్ఞానంబు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 90

సాయి ! నీవుతెలుపు సరణి సాధించెడు
సాధకునకు ముక్తి సాధ్యమగును ;
నీవు తెలుపుమాట నిజము ముక్తికిబాట
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 91

అష్టసిద్ధులొసఁగు నష్టాంగ యోగంబు ;
యోగివలెనె దివ్యయోగమహిమ
లెల్లఁజూపి నరుల యిడుమలఁబాపెదు
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 92

శరణుఁజొచ్చునట్టి శరణార్థులకుఁబ్రీతి
జ్ఞానశక్తి నొసఁగికాచెదీవు
శక్తిముక్తులొసఁగు భగవానుఁడవునీవె
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 93

నీదు చరణములను నియతిమైఁబూజింప
సుఖములిచ్చి మఱియు శుభముఁగూర్తు
సాయిదేవ ! నిన్ను సర్వదా పూజింతు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 94

సర్వదేవరూప ! సత్యహృదయ ! యీశ !
శరణువేఁడుచుంటి స్వామి ! నిన్ను
సర్వవేళలందు సాయి ! కావుమనన్ను ;
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 95

ఆర్త భక్తులనిల నాదుకోఁదలఁచియే
యవతరించి తిప్పుడాదిదేవ !
బోధచేసి జనుల బాధలఁబాపుదు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 69

పరమభాగవతులు భగవానుఁడవని నిన్
భజనచేయుచుందురి పరముఁగోరి
భక్తరక్షకుఁడవు భగవానుఁడవె స్వామి !
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 97

ప్రాణదాతవీవు పరమేశ ? సాయీశ !
విభవమిత్తువీవు విష్ణురూప ?
నీదు సృష్టినిలుచు నిత్యమై సత్యమై
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 98

సిరిడిసాయిబాబ తిరిగి జన్మంబెత్త
సత్యసాయివైతి జనులఁగావ
భక్తులనెడి సిరిడి భగవానుఁడవు నీవె
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 99



"ఈ భవమ్ము ముగియ నీభువిన్ బ్రభవింతుఁ
బ్రేమ సాయి యనెడి పేరితోడ"
అనుచుభక్తకోటి కానఁడె తెల్పితి
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 100

నీవెదేవుఁడవని నీవెఱింగితి స్వామి !
సత్యసాయి ! నీవుశాశ్వతుఁడవు !
జనులఁగావ మరల జగతిలో జన్మించు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 101

తనువుఁదాల్చినట్టి దైవంబునీవని
తెలివియున్నవారు తెలిసికొనరె?
కలివి వెలసితీవు కైవల్య మొసఁగఁగా
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 102

ఆగమ విధితోడ నర్చకుల్ నీకును
పూజచేయుచుందురి పుణ్యమూర్తి !
సర్వమనుజసేవ్య ! సకలశుభప్రద !
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 103

వేలకొలఁదిజనులు వేచియుందురెపుడు
వేడ్కతో నినుఁగన వేదవేద్య !
కోరికలను మఱచి కొలుతురు నినుమదిన్
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 104

జపమిఁకేల నిన్ను సతతము చూడఁగా
తపమిఁకేల నీదు తనువు చూడ ;
జప తపఃఫలమ్ము సాయి మాకిత్తువు
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 105

ఈ ప్రశాంతి నిలయ మీ కలియుగమున
సాయి నిలయమగుట జనులుదీని
నాశ్రయింతురు సుఖ మాత్మశాంతినిఁగోరి
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 106

సాయి శతకమేను సద్భక్తితో వ్రాయ
శక్తినొసఁగితీవె సత్యసాయి !
కృతి నొసంగుచుంటిఁ గృపతోడఁగైకొను
సత్స్వరూప ! సత్యసాయి బాబ ! 107

సాయి శతకమెవరు చదివిన వినినను
సర్వసుఖములంది యుర్విశాంతిఁ
బడయఁగలరు ; పిదప భవ్య ముక్తియుఁగాంతురి
సత్స్వరూప ! సత్యసాయి బాబ! 108

ఓం తత్సత్

శ్రీసత్య సాయి బాబార్పణమస్తు

సంపూర్ణము

ప్రేమా ప్రింటింగ్ వర్క్సు. విశాఖపట్టణము-4

రచయిత— డా॥ మోదేకుర్తి వేంకటసత్యనారాయణ

కృతులు (అచ్చయినవి)

శ్రీ సత్యసాయి శతకము

శ్రీరామ శతకము

శ్రీ కృష్ణ శతకము.

(అచ్చు కావలసినవి)

శ్రీ పాండురంగశతకము

ఖండ కృతులు

నాటికలు

శ్రీ వేంకటాచల మాహాత్మ్యము (ఆంధ్రాను వాదము)

వైదికచ్ఛందో వికాసము

సంస్కృత ప్రాకృత చ్ఛందస్సులు

ఆంధ్రచ్ఛందో వికాసము